**Bachche Aur Islam**
**(Telugu)**

# బాలల సంవత్సరం
# ఇస్లాం సందేశం


మూలం

**సయ్యద్ జలాలుద్దీన్ అన్సర్ ఉమరి**

అనువాదం

**అబ్బాదుల్లా**

ఐక్యరాజ్య సమితి 1979వ సంవత్సరాన్ని బాలల సంవత్సరంగా ప్రకటించినప్పుడు ఉర్దూ భాషలో వెలువడిన పుస్తకం ఇది.

పిల్లల పట్ల తల్లిదండ్రులు, సమాజం బాధ్యతలను ఈ పుస్తకంలో పొందుపరచడం జరిగింది. బాలల సంరక్షణ ఒక సంవత్సరంతో ఆగే పని కాదు. ఇది నిరంతరం మానవ సమాజాల్లో కొనసాగే ప్రక్రియ. ఆ ముఖ్య ఉద్దేశాన్ని ముందుంచుకొని ఎప్పుడూ అందరికీ పనికొస్తుందని ఈ పుస్తకాన్ని తెలుగులో ప్రచురించాము.

డైరక్టర్
తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# బాలల సంవత్సరం ఇస్లాం సందేశం

మానవ సృష్టి అద్వితీయం. అతని శైశవం అద్భుతమైనది. బాలబాలికల జననం దైవమహత్యం. పసిపిల్లవాడు అమాయకుడు అమాయకత్వంలోనే ఆకర్షణ ఉంది. అందరిని అలరించే వ్యక్తిత్వం అతనిలో ఉంటుంది. పిల్లల చల్లని చూపులు, ముసిముసినవ్వులు, తడబడే మాటలు, అది కావాలి ఇది కొనాలి అనబడే కోరికలు, అల్లరిపనులు, ఆటలు, పరుగులు అన్నీ అందరికి ఆహ్లాదాన్నిస్తాయి. చూస్తూ ఉండిపోతారు పెద్దవారు. కాని ఏ పిల్లవాని భవిష్యత్తు ఎలా మలచబడనుందో ఎవరికీ తెలియదు. సృష్టి బాలబాలికలకు ఏఏ అరుదైన భాగ్యం ప్రసాదించనుందో తెలుసుకొనే వీలుండదు. వారి ప్రతిభ ఎలా ఉంటుందో తెలియదు. పెరిగి పెద్ద అయిన తరువాత ఆ శిశువు ఏ ఘనకార్యాలు సాధిస్తూ, ఎలాంటిసేవలు మానవాళి కందిస్తాడో తెలుసుకొనడం సాధ్యం కాదు. అమాయక బాల బాలికల్లో రేపటి దినం ఎవరు రైతౌతారు, ఎవరు వ్యాపారవేత్త లౌతారు, ఎవరు పారిశ్రామికవేత్తలౌతారు, ఎవరు డాక్టర్లు ఇంజినీర్లౌతారో, ఎవరు పాత్రికేయులు, ఎవరు న్యాయాధీశులౌతారో, ఎవరు శాసనసభ్యు

లౌతారో, ఎవరు అధ్యాపకులు, న్యాయవాదులు, సైంటిస్టులు, ఫిలాసఫర్లు మరియు రాజకీయ ఆర్థిక నిపుణులౌతారో, విజ్ఞానవేత్తలు, సైనికాధికారులవుతారో ఎవరికి తెలియదు. వానివల్ల కుటుంబీకులకు, వంశీయులకు, జాతికి మానవాళికి ఎంత ప్రయోజనం అభివృద్ధి చేకూరుతుందో ఎవరికీ తెలియదు.

బాల బాలికలందు ఎన్ని యోగ్యతార్హతలు ఉన్నప్పటికి వారి పుట్టుక బట్టి చూస్తే ఎంతో బలహీనులుగా, ఏమీ చేయలేని పరిస్థితిలో ఉంటారు. ప్రేమ, ఆదరణలు, సంరక్షణ వారికి కావాలి. సృష్టిలో ఏ ప్రాణి తన సంతానం పట్ల ఇంత శ్రద్ధ చూపవలసిన అవసరం ఉండదు. కాని మానవ సంతానాన్ని ఎంతో శ్రద్ధతో పెంచి, పోషించి పెద్ద చేయవలసి ఉంటుంది. ఏమరుపాటుతోనైనా బాలబాలికల జీవితానికి అపాయం కలుగవచ్చు. కేవలం శారీరక పోషణమాత్రమే కాదు, వారి మానసిక, నైతిక ఆలోచనా విధానాలకు సానపట్టేందుకు మరింత జాగ్రత్తలు తీసుకోవలసి ఉంటుది.

ఇది మరీ కష్టమైన పని. ఈ క్రమంలో నిర్లక్ష్యం వహించినా, తప్పు చేసినా వారు దారితప్పి పెడమార్గం పట్టి సమాజానికే ముప్పు కలుగజేస్తారు. శైశవదశలో మంచి మార్గాన పెంచబడే పిల్లలు సమాజంలో శాంతి, భద్రతలతో పాటు మానవజీవితం ప్రశాంతంగా పురోగమించడానికి సహాయపడతారు.

సమాజంలో ప్రతి పిల్లవానికీ ప్రాముఖ్యత ఉంది. సంతానం తల్లిదండ్రులకు కన్నులపండుగ. తల్లిదండ్రుల జీవితం సంతానానికి అంకితమౌతుంది. వారూ సంతానం వల్లనే జీవితంలో ప్రశాంతత

సుఖం పొందుతారు. సంతానం భావి జీవితాన్ని తీర్చిదిద్దాలని వారు కలలు కంటుంటారు. ఇంకా తల్లిదండ్రులు ముసలిప్రాయానికి వచ్చేసరికి సంతానం తమకు అండదండగా ఉండగలదని ఆశిస్తారు. ఇలా సంతానం పట్ల కేవలం తల్లిదండ్రులే కాదు, వారి వంశీయులు బంధు మిత్ర పరివారం కూడా ఆశలు పెంచుకొంటారు. సమాజం, దేశం బాలబాలికల ఆస్తిపాస్తులౌతాయి. అందువల్ల ప్రతి వ్యక్తి బాలబాలికలను పరిపూర్ణ వ్యక్తిత్వం కలవారిగా తీర్చిదిద్దాలి. వారి నైతిక విధానాన్ని, చట్టపర బాధ్యతల్ని గుర్తింప జేయడానికి సువిద్యతోపాటు శారీరక సౌష్టవం కలవారుగా తయారు చేయాలి. వ్యాధిగ్రస్తులు కాకుండ, బలహీనతలకు లోనుకాకుండ, అజ్ఞానపు పంథాలో పడకుండా, వక్రమార్గాలను ఆశ్రయించకుండా బాలలను కాపాడాలి.

## ఇస్లామీ శిక్షణ

బాలబాలికల ప్రాధాన్యతను పురస్కరించుకుని 1979వ సంవత్సరాన్ని ఐక్యరాజ్యసమితి బాలల సంవత్సరంగా జరుపుతుంది. ఈ సంవత్సర ఉత్సవాల సందర్భంగ బాలబాలికల విషయంలో ఇస్లాం తెలియపరిచే విద్యా విధానాలను సంక్షిప్తంగ తెలియపరిచే ప్రయత్నం జరుగుతుంది. అనేక జీవిత రంగాలలో ఇస్లాం మనకు మంచి హితవులనిచ్చింది. అదే విధంగ బాలబాలికల పెంపకం, శిక్షణలలో కూడ శ్రేష్టమయిన హితోపదేశాలనిచ్చింది. ఈ ఉపదేశాలు పరిపూర్ణమైనవి, రుగ్మతలకు దూరమైనవి. మానవకల్పితాలు ఎంత మంచివైన లోపాలకు అవకాశాన్నిస్తాయి. ఇస్లాం ప్రతిపాదించే ఈ అమూల్య విధానాలను పరిశీలిద్దాం.

## సంతానాన్ని హత్యచేయడం నిషేధించబడింది

మానవ చరిత్ర పుటలను పరిశీలిస్తే, అందులోని అఘాయిత్యా లలో కెల్లా దారుణమైనవి శిశుహత్యలు. దీనికి కారణం మానవుని తెలివిలేనితనం, అజ్ఞానం, మూఢనమ్మకం, అర్థంలేని వ్యర్థ సంప్రదాయం దుష్టప్రేరణలు. వీటివల్ల మనిషి చేతులార తన సంతానాన్ని తానే చంపుకొంటాడు. బండరాతి మనస్సులో కఠిన హృదయంతో చేసే ఈ హత్యల వెనుక లేమిననుభవిస్తాం, ఆకలిదప్పులతో అలమటిస్తామనే భయభ్రాంతులున్నాయి. నా సంపాదనలో నా సంతానానికి భాగమివ్వాలి. తినే నోళ్ళు సంపాదించే చేతులకంటే ఎక్కువౌతాయి అని పిల్లల్ని చంపుతాడు మనిషి. ఇస్లాం ప్రచారంలోకి రాకముందు అరబ్బుదేశంలోని కొన్ని అనాగరికజాతుల్లో ఇలాంటి సంఘటనలు జరిగేవి. ఇస్లాం సమాజసంస్కరణకు గట్టి పునాదులు వేస్తూ ఈ శిశుహ్యాల్ని ఖండించింది. కనికరం, దయాదాక్షిణ్యం లేని అమానుష చర్యలుగా క్షమించరాని నేరాలుగా శాసించింది. ప్రపంచంలో జన్మించే ప్రతి శిశువు దైవాజ్ఞ వలన పుడుతుందని ప్రజానీకానికి తెలియపరిచింది. దైవాజ్ఞ వల్ల పుట్టబోయే ప్రతి వ్యక్తిని దైవం పోషిస్తాడు. అతని అవసరాలను తీర్చే బాధ్యత ఆయనదేనని, మానవుల్ని ఆకలి బాధకు గురిచేయడం, వారిని చంపడం అనేది ఆయన ధర్మం కానే కాదు. భూమ్యాకాశాలలో ఉండే వనరులు ఆయన అధీనంలోనే ఉన్నాయి. ఆయన మీకు ఉపాధి నిస్తాడు. వారికీ ఇస్తాడు. ఇందులో సందేహం లేదు.

وَلَا تَقْتُلُوْٓا اَوْلَادَكُمْ خَشْيَةَ اِمْلَاقٍ نَحْنُ نَرْزُقُهُمْ وَاِيَّاكُمْ اِنَّ قَتْلَهُمْ كَانَ خِطْاً كَبِيْرًا (بنی اسرائیل :۳۱)

పేదరికానికి భయపడి మీరు మీ సంతానాన్ని హత్యచెయ్యకండి. మేము వారికీ ఉపాధిని ఇస్తాము, మీకూ ఇస్తాము. వాస్తవానికి వారిని హత్యచేయడం ఒక పెద్ద నేరం.

*(బనీ ఇస్రాయీల్-31)*

వారిని చంపడమనేది మహాఘోరం. మగపిల్లలు భవిష్యత్తులో తోడ్పడుతారు. ఆర్థిక విషయాలలో చేదోడువాదోడుగా ఉంటారు, శత్రువులను ఎదుర్కోవడంలో అండగా ఉంటారు. వంశం తెగ వారికి బలం చేకూరుస్తారని ఆశించవచ్చు. ఆడపిల్లల విషయంలో వారి ఉనికి పూర్తి విభిన్నంగా ఉంటుంది. ఆర్థికంగా వారు మాకు గుదిబండలే, ఆపద సమయంలో వారికి రక్షణ కల్పించడం భారం అవుతుంది. అందుచేత వారిని వధించడం పూర్వం ఒక ఆనవాయితీగా ఉండేది. ఇస్లాం ఆవిర్భావం అలాంటి భావనలపై దాడి చేసింది. ప్రళయదినం ఆ అమాయక శిశువులను అడగడం జరుగుతుంది. ఏ కారణం వల్ల నువ్వు చంపబడ్డావు? నువ్వు చేసిన నేరం ఏమిటి? నీ తల్లి దండ్రులు నిన్ను సజీవ సమాధి చేయడానికి కారణమేమిటని అడగబడుతుంది. నేను దౌర్జన్యానికి గురయ్యాను. శక్తిసామర్థ్యాలు లేక బలయ్యాను. అని ఆ శిశువు చెబుతుంది. ఆ సాక్ష్యం సమక్షంలో నరకయాతన నుంచి ఎవరూ ఆ దుర్మార్గులను రక్షించలేరు.

وَاِذَا الْمَوْءٗدَةُ سُئِلَتْ بِاَيِّ ذَنْۢبٍ قُتِلَتْ

సజీవంగా పాతిపెట్టబడిన బాలికను, నీవు ఏ తప్పు వల్ల హత్య చేయబడ్డావని అడిగినప్పుడు. *(అత్ తక్వీర్ : 8-9)*

మహాప్రవక్త ముహమ్మద్ (స) దైవం తరపున అలాంటి చెడు చర్యను ఖండిస్తూ నిషేధించడమయిందని ప్రకటించారు.

"నిశ్చయంగా తల్లుల ఆజ్ఞ నిరాకరించడం, కూతుళ్ళను ప్రాణాలతో సమాధి చేయడం హరాం చేయబడింది" (బుఖారి)

إِنَّ اللّٰهَ حَرَّمَ عَلَيْكُمْ عُقُوقَ الْأُمَّهَاتِ وَوَأْدَ الْبَنَاتِ.... (بخاری، کتاب الادب)

వివిధ మతాలలో సంతానాన్ని దేవీదేవతల పేర్లతో బలి ఇవ్వడం ఒక సంప్రదాయంగా ఉంది. కాని, మతం పేరిట అన్యాయంగా హత్యచేయడం మతాన్ని అవమానించడం అవుతుంది. దైవం సంతానాన్ని చంపమని ఎక్కడా చెప్పలేదు. ఆయన సంతోషం పొందడానికి అమాయక ప్రాణాలను వధించాలని ఎక్కడా చెప్పలేదు. ఇస్లామ్‌లో ఇలాంటి నిష్కారణ వధకు ఎక్కడా అవకాశమే లేదు. హజ్రత్ అబ్దుల్లా ఇబ్నె అబ్బాస్‌తో ఒక మహిళ ఇలా విన్నవించింది. "అయ్యా! నా శిశువును బలిచేస్తానని నేను మొక్కుబడి చేసుకున్నాను. మహాప్రవక్త (స) ఆమె శిశువు బలిని ఆపుతూ మొక్కుబడికి కప్ఫార (చేసిన తప్పుకు ప్రాయశ్చితం) చెల్లించుకోమని చెప్పారు." (ముఅత్తా)

## తల్లిదండ్రుల ఉత్సాహానికి ప్రోత్సాహం

ఇస్లాం శిశువులను మూఢనమ్మకాల వల్ల కలిగే ప్రమాదాల నుండి రక్షించింది. రెండవ వైపు పసి పిల్లల పట్ల మాతాపితలు చూపే స్వాభావిక ఉత్సాహం కల్గి ఉండడాన్ని ప్రోత్సహించింది. సంతానం కలుగడం వల్ల తల్లిదండ్రులకు కలిగే ఆనందానుభూతులు అనుభవించడానికి మంచి మార్గం చూపింది. దుబార ఖర్చులేకుండ,

ఉన్నత మర్యాదలతో ఈ ఆనందాన్ని పంచి పెడుతుంది ఇస్లాం. సంతాన పెంపకంలో వారికి విద్యాబుద్ధులు గరిపించడంలో సంపూర్ణ విధానాలను తెలియపరిచింది.

## పుట్టిన శిశువు చెవిలో అజాన్ పిలుపు ఇవ్వడం

పుట్టిన శిశువు చెవిలో అజాన్ పిలుపు ఇవ్వడం ద్వారా ఇస్లాం ఒక ప్రత్యేకమైన నాగరితా వ్యవస్థను సామాజిక జీవన విధానాన్ని రూపొందించాలని కోరుతుంది. ఇది ఒక ప్రత్యేకమైన జీవన సరళిని, విధానాన్ని ప్రబోధిస్తోంది. అటువంటి ప్రబోధనలతో పరిసరాలన్నింటిని ప్రభావితం చేయగోరుతుంది. ఈ ప్రయత్నం పుట్టిన నాటి నుంచి ప్రారంభమవుతుంది. అందువల్లనే, శిశు జన్మతోనే ఆ శిశువు చెవిలో 'అజాన్' పలుకాలని ఇస్లాం కోరుతుంది. హజ్రత్ అబూ రాఫె (రజి) గారు ఇలా ఉల్లేఖించారు: మహాప్రవక్త ముహమ్మద్ (స) మనుమడు హజ్రత్ హసన్ (రజి) పుట్టినప్పుడు ఆ శిశివు చెవిలో 'అజాన్' ఇచ్చారు (అబూదావూద్). ఆ కాలంలో అజాన్ పిలుపునకు అనేక ప్రత్యేకత లుండేవి. అందులో ఒకటి ఏమిటంటే సంతోష సమయాలలో అల్లాహ్ పేరు పలకడం, ఆయన ఘనతను శ్లాఘించడం, రెండవ ఉద్దేశ్యం దైవనామస్తుతితో షైతాన్ దుష్ప్రభావాన్ని దూరం చేయడం, మూడవ ఉద్దేశ్యం శిశువు తల్లిదండ్రులు ముస్లిములని ప్రకటిస్తూ వారు ఏవిధంగా దైవానికి విధేయులుగా ఉన్నారో అదే విధంగా వారు తమ శిశువును కూడా దైవం పట్ల విధేయుత కలిగి ఉండాలని తలచడం, నాల్గవ ఉద్దేశ్యం అన్నింటికంటే ముందు దైవ పవిత్రతను,

عَبْدُ الرَّحْمٰنِ وَ اَصْدَقُهَا حَارِثٌ وَهَمَّامٌ وَ اَقْبَحُهَا حَرْبٌ وَمُرَّةٌ۔ (رواه ابو داؤد)

సంఘటన రీత్యా కూడా వాస్తవమైన పేరు హారిస్(రైతు) హమ్మామ్ (కోరిక గలవాడు) అని మరియు అన్నిటికంటె చెడుపేరు హర్బ్ (యుద్ధం, ముర్రహ్ (చేదు)." (అబూదావూద్)

## అఖీఖా చెయ్యడం

సంతానం దేవుని వరం. వారి జన్మవల్ల తల్లిదండ్రులకు స్వాభావికంగా సంతోషం కలుగుతుంది. అటువంటి శుభ సమయంలో అల్లాహ్ పేరిట హలాల్ జంతువును జిబహ్ చేయడం ప్రవక్త (సఅసం) సంప్రదాయం, దీనినే అఖీఖా అని అంటారు. ఇది సంతానం కలుగడం పట్ల దైవానికి కృతజ్ఞత తెలుపుకోవడంతో పాటు తమకు కలిగిన సంతోషాన్ని వ్యక్తపరచడం కూడా.

اَلْغُلَامُ مُرْتَهَنٌ بِعَقِيْقَتِهٖ يُذْبَحُ عَنْهُ يَوْمَ سَابِعِهٖ وَيُحْلَقُ رَأْسُهٗ۔ (ترمذی، ابواب الاضاحی)

"శిశువు తన అఖీఖా వల్ల కుదువ వుంటాడు. అందుచేత ఏడవ దినం శిశువు తరపున (హలాల్) జంతువును జిబహ్ చేయాలి. (పుట్టిన) శిశువుకు పేరు పెట్టాలి. తల వెంట్రుకలు తీయించాలి." (తిర్మిజి)

అఖీఖా మాంసాన్ని స్వయంగా తినవచ్చు. బంధుమిత్రులకు తినిపించవచ్చు, బీదసాదలకు పంచిపెట్టనూ వచ్చు. సంతోష సమయాలలో బీదలకు, అవసరమున్న వారికి ఎంతఎక్కువ సాధ్య పడుతుందో అంత ఎక్కువగా సహాయం చెయ్యాలి. ఈ సందర్భంలో శిశువు తల వెంట్రుకలు తీయించి దాని బరువంత వెండిని బీదలకు

తప్పరిసరిగా పంచడం మంచి అలవాటు అని చెప్ప బడింది. మహాప్రవక్త (సఅసం)కు మనుమడు హజ్రత్ హసన్ (రజి) కలిగినప్పుడు ఆయన (సఅసం) హజ్రత్ ఫాతిమా (రజి)తో ఇలా అన్నారు.

"శిశువు తల వెంట్రుకల్ని గొరిగించి వాటి బరువుకు సమాన మైన వెండిని దానం చెయ్యండి"

اِحْلَقِیْ رَاْسَهٗ وَتَصَدَّقِیْ بِزِنَةِ شَعْرِهٖ فِضَّةً۔ (ترمذی، ابواب الاضاحی)

## పిల్లల పెంపకం

నైతికంగా మరియు చట్టపరంగా మనిషి తన భార్యా పిల్లల ఖర్చు భరించాలి. వారికి కావలసిన అన్నపానీయాలు, బట్టలు, ఇల్లు, చికిత్స మొదలగు అవసరాలను తీర్చాలి. ఆర్థిక బాధ్యతల్ని విస్మరించడం, తనకు సంబంధించిన వారి పోషణ భారాన్ని మరువడం, వారిని అలాగే అన్నపానీయాలతో అలమటిస్తుండేట్లు వదలిపెట్టడం, చివరకు వారు వినాశమవునట్లు వ్యవహరించడం మహాపాతకం. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా ప్రబోధించారు:

ఎవరి వ్యయభారం మోసి బాధ్యతతో పెంచాలో వారిని మనిషి నిర్లక్ష్యం చేస్తే అతణ్ణి వినాశం చేసేందుకు ఆ పాపం చాలు. (అబూదావూద్)

كَفٰى بِالْمَرْءِ اِثْمًا اَنْ يُّضَيِّعَ مَنْ يَّقُوْتُ (ابوداؤد، کتاب الزکوٰۃ)

తల్లిదండ్రుల ప్రవరస్త కూడా ఆలోచింపదగిన విషయం. తనయుల పెంపకంలో తల్లిదండ్రులు చూపే ఆసక్తి సాధారణంగా కూతుళ్ల పట్ల ఉండదు. ఈ విషయంలో ఇస్లాం చూపించే మార్గదర్శకం

మరో విధంగా ఉంది. ఆడబిడ్డల పెంపకం మరణానంతర జీవితంలో శ్రేయోదాయకం. ఆ జీవితంలో కృతకృత్యులు కావడానికి దోహద పడుతుంది. మహాప్రవక్త ముహమ్మద్ (స) ఇలా ప్రవచించారు:

مَنْ بُلِيَ مِنْ هٰذِهِ الْبَنَاتِ شَيْئًا فَأَحْسَنَ إِلَيْهِنَّ كُنَّ لَهُ سِتْرًا مِّنَ النَّارِ

(بخاری، کتاب الادب)

మనిషి తనకు కలిగిన బాలికల వల్ల దేవుని పరీక్షకు గురయితే, ఆ వ్యక్తి వారిపట్ల మంచిగా వ్యవహరిస్తే వారు (ఆ బాలికలు) ఆ వ్యక్తి నరకాగ్ని నుండి రక్షించబడేందుకు సాధనాలవుతారు (బుఖారి)

మరో హదీసులో ఇలా చెప్పబడింది:

مَنْ عَالَ جَارِيَتَيْنِ حَتّٰى تَبْلُغَا جَاءَ يَوْمَ الْقِيَامَةِ أَنَا وَهُوَ هٰكَذَا وَضَمَّ أَصَابِعَهُ

(مسلم، کتاب البر والصلۃ)

"ఎవరైతే బాలికలను పెంచి పోషిస్తారో స్వర్గంలో నా చెంత ఉంటారు. నా సాన్నిహిత్యం వారికుంటుంది."

"ఏ వ్యక్తి అయితే ఇద్దరు కూతుళ్ళను యుక్త వయసు వచ్చే వరకు పెంచుతాడో ప్రళయం తరువాత పరిష్కార దినాన అతను నేను ఇలా వస్తాం (అని తన రెండు వేళ్ళను కలిపి చూపించారు" (ముస్లిం)

## బాలల పట్ల ప్రేమ

సంతానం పట్ల ప్రేమ వాత్సల్యం కలిగి ఉండటం తల్లిదండ్రులకు సహజం. అయినప్పటికీ కొందరు రాతి గుండె కలవారై దయ

లేనివారుగా పసిపిల్లల పట్ల ప్రవర్తిస్తారు. మరికొందరి మనస్తత్వమే వేరు. బాలబాలికల పట్ల చిరునవ్వులు చిందిస్తూ ప్రేమపూరిత మాటలతో ముచ్చటించడమంటే నాగరికతకు వ్యతిరేకమని, అది సరైన అలవాటు కాదని తలుస్తారు. ఇదే తీరులో ఆలోచించే మరికొందరు ప్రబుద్ధులు తమ పిల్లలను పలుకరించడం, మందహాసంతో ఆదరించడం తమ హోదాకు రాణించేది కాదని వారి నుండి దూరంగా ఉంటారు. ఇలా ఆలోచిస్తూ పసిపిల్లలంటే ఛీదరించుకుంటూ వారికి దూరంగ ఉండటం మంచి అలవాటు కాదు. పసి పిల్లలంటే ఆప్యాయత చూపని మాతృ హృదయం బండరాయిగా వ్యవహరించే తండ్రి గుండె మానవత్వానికి వ్యతిరేకం, దయలేని మనస్తత్వం ఇస్లాంకు విరుద్ధం. ఒకసారి మహాప్రవక్త ముహమ్మద్(స)కు తన మనుమడ్ని దగ్గిర చేర్చి ముద్దాడారు. అది గమనించిన అఖ్రా బిన్ హాబిస్ ఇలా అన్నారు. "ప్రవక్తా(స) నేను పదిమంది సంతానం కలవాణ్ణి. కాని వారిలో ఒకరినైనా ఎన్నడూ ముద్దుపెట్టుకోలేదు. అది విన్న ప్రవక్త(స) గారు అతణ్ణి ఎంతో ఆశ్చర్యంతో చూస్తూ ఇలా అన్నారు: ఎవడైతే మానవులపై దయ చూపడో అతనిపై దైవం దయచూపడు. ( బుఖారి). మన సమాజంలో సాధారణంగా ఆడపిల్లల పట్ల ప్రేమాదరణలు తక్కువ కలిగి ఉంటాం. ఆదర్శమూర్తి మహాప్రవక్త(స) తన కూతుళ్ళను అసాధారణంగా ప్రేమించేవారు. ఒకప్పుడు ఒక మహాశయుడు హజ్రత్ ఆయేషా(ర)తో ఇలా అడిగారు. మహాప్రవక్త(స) అందరి కంటే అమితంగా ఎవరిని ప్రేమించేవారు? వెంటనే ఆమె హజ్రత్ ఫాతిమా (ర) అని జవాబి

చ్చారు. మరోసందర్భంలో హజరత్ ఆయేషా(ర) ఇలా అంటున్నారు: "హజ్రత్ ఫాతిమా (ర) రావడం చూస్తూ మహాప్రవక్త (స) ప్రేమాదరణలతో లేచి నిలబడే వారు, స్వాగతం పలుకడానికి ముందుకు నడిచి వచ్చేవారు, ఆమె చేతినందుకొని ముద్దాడేవారు. ఆమెను తన చెంతన కూర్చోపెట్టుకునే వారు. ఇదే తీరున హజ్రత్ ఫాతిమ(ర) కూడ ప్రవర్తించేవారు. మహాప్రవక్త(స) గారికి ఫాతిమా(ర) స్వాగతం పలికేందుకు ముందుకొచ్చేవారు. ఆయన (స) చేతిని పట్టుకునేవారు. చేయి చూపిస్తూ తాను కూర్చున్న చోట ఆయన(స) ను కూర్చోపెట్టేవారు. (అబూదావూద్)

## ఒకే తీరున ప్రవర్తించాలి

అన్నపానీయాల విషయాలలో, ఇచ్చిపుచ్చుకోవడంలో సంతానం పట్ల ఒకే తీరున ప్రవర్తించాలి. వ్యత్యాసం చూపడం అయిష్టమయిన పని. అలా వ్యత్యాసం చూపినట్లయితే పిల్లలలో విద్వేషం జనిస్తుంది. పర్యవసానం వారి మధ్య శత్రుత్వానికి దారి తీస్తుంది. పైపెచ్చు తల్లి దండ్రుల విషయంలో వారికి అపోహలు కలిగి అవి చెడు సంఘటనలకు దారితీస్తాయి. అలాంటి విషయాలలో ప్రవక్త (స) సూచనలు ఉన్నాయి:

"దైవానికి భయపడండి. సంతానం పట్ల సమానంగా వ్యవహరించండి." اتقوا الله واعدلوا بين اولادكم
(مشكوة، كتاب البيوع باب فی العطایا بحوالہ بخاری و مسلم)

సంతానంలో కూడా ఆడ మగ సంతానం విషయంలో బేధ భావాలను చూపిస్తూ మగ పిల్లలను ఆడబిడ్డల కన్న మిన్నగా చూడడం అల్పగుణం మాత్రమే కాదు అపఖ్యాతికి కారణ మవుతుంది.

ఎవరైతే ఆడమగ సంతానం పట్ల ఒకే దృష్టి కలిగి సమానంగా వ్యవహరిస్తారో వారికి స్వర్గప్రవేశ శుభవార్త వినిపించారు మహా ప్రవక్త (సఅసం).

مَنْ كَانَتْ لَهُ أُنْثَى فَلَمْ يَئِدْهَا وَلَمْ يُهِنْهَا وَلَمْ يُؤْثِرْ وَلَدَهُ عَلَيْهَا يَعْنِي الذُّكُورَ أَدْخَلَهُ اللَّهُ الْجَنَّةَ

(ابوداود، كتاب الادب)

"ఒక వ్యక్తికి కూతురు ఉంటే అతడు ఆమెను సజీవంగా సమాధి చేయకుండ, ఆమెపట్ల అల్ప గౌరవంతో వ్యవహరించకుండా. ఆమెకంటే మగ సంతానానికి అధిక్యత ఇవ్వకుండా ఉంటే అతనికి అల్లాహ్ స్వర్గప్రవేశం కల్పిస్తాడు." (అబుదావూద్)

## విద్యాబుద్ధులు గరిపించడం

అజ్ఞానాన్ని, నిరంకుశత్వాన్ని ఇస్లాం అంగీకరించదు. విద్యా వెలుతురు నలుదిశల వ్యాపించాలనే కోరుతుంది ఇస్లాం. అందువల ననే విద్యాభ్యాసానికి, విద్యావ్యాప్తికి ఇస్లాం ప్రాముఖ్యత నిచ్చింది. ప్రతి ముస్లిం ఇస్లాం ధార్మిక మూల సూత్రాల జ్ఞానాన్ని తప్పక నేర్చుకోవాలని కోరుతుంది. మహాప్రవక్త ప్రవచనాలలో బాలబాలికలకు విద్య నభ్యసింపజేయాలని నొక్కి చెప్పడమయింది.

مَا نَحَلَ وَالِدٌ وَلَدًا مِنْ نَحْلٍ أَفْضَلَ مِنْ أَدَبٍ حَسَنٍ

(ترمذی، ابواب البر والصلة)

"ఒక హదీసులో తల్లి దండ్రుల బాధ్యతను వివరిస్తూ తల్లి దండ్రులు సంతానానికిచ్చే ఉత్కృష్ట బహుమతి వారికిచ్చే సర్వశ్రేష్టమైన విద్య మరియు ఉత్తమ ప్రవర్తన" అని చెప్పబడింది.

మహాప్రవక్త మహమ్మద్ (సఅస) ఇలా ప్రవచించారు:

"ఎవరైతే ముగ్గురు కూతుళ్ళు ను పెంచి పోషించి ఉత్తమ నైతిక ప్రవర్తనను నేర్పి వారికి వివాహం చేయించి వారిని మంచిగా చూసు కొన్నట్లయితే అతని కోసం స్వర్గం వేచి వుంది."

مَنْ عَالَ ثَلَاثَ بَنَاتٍ فَأَدَّبَهُنَّ وَزَوَّجَهُنَّ وَأَحْسَنَ إِلَيْهِنَّ فَلَهُ الْجَنَّةُ۔

(ابوداؤد، کتاب الادب، باب من عال یتامیٰ)

బిడ్డలను ప్రేమించమని ఇస్లాం కోరుతుంది. కాని ఆ ప్రేమ సంబంధం శ్రుతిమించి ఉండరాదంటుంది ఇస్లాం.

## పిల్లలపెంపకం, సంరక్షణ

వారికి విద్యాబుద్ధులు నేర్పించడం, తల్లిదండ్రుల బాధ్యత అని చెపుతుంది ఇస్లాం. మరోవైపు సంతానం కోసం ధార్మిక మరియు నైతిక విలువల్ని నేర్పక, హరాం మరియు హలాల్ విషయాలను లెక్కపెట్ట కుండ సంతానపు కోరికలు, వారి అభిరుచుల కోసం తాపత్రయ పడడం, స్వయంగా వినాశానికి ఆహ్వానం పలుకడమౌతుంది. దైవం ఇలా ఆదేశిస్తున్నాడు:

విశ్వాసులారా! మీ సిరిసంపదలూ, మీ సంతానమూ మిమ్మల్ని అల్లాహ్ సంస్మరణ నుండి మరల్చరాదు. ఎవరైతే ఇలా మరల్చబడతారో వారే నష్టానికి గురి అయ్యేవారు.

(అల్ మునాఫిఖూన్ : 9)

يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا لَا تُلْهِكُمْ أَمْوَالُكُمْ وَلَا أَوْلَادُكُمْ عَنْ ذِكْرِ اللَّهِ وَمَنْ يَفْعَلْ ذَٰلِكَ فَأُولَٰئِكَ هُمُ الْخَاسِرُونَ

(المنافقون-۹)

## అనాధ బాల బాలికల సంరక్షణ

బాల బాలికలు తల్లి దండ్రులు గతించాక నిరాధారులై భౌతిక

అవసరాలు నోచుకోలేని స్థితిలో ఉంటారు. వారికి విద్యాబుద్ధులు నేర్పించే వారుండరు. అందువల్ల వారు ప్రాపంచిక జీవితంలో ఇతరులకంటే వెనుకబడి ఉంటారు. వారు తప్పుడు త్రోవలో పడిపోవడానికి ఎక్కువ ఆస్కారముంటుంది. అలాంటి సమయంలో అనాథ బాలుర పెంపకం వారి వారసులపై ఉంది దివ్యఖుర్ఆన్ ఇలా అంటుంది:

وَعَلَى الْوَارِثِ مِثْلُ ذَالِكَ

వారసులపై కూడా అదే బాధ్యత (అంటే తల్లిదండ్రులపై ఉండు బాధ్యత) ఉంది.

అనాథ బాల బాలికల వద్ద ఆ స్తిపాస్తులు., ధనం ఉన్నట్లైతే ఆ ధనం వ్యయపరచి అనాధులకు విద్యారక్షణలు ఇవ్వవచ్చు. కేవలం వ్యయం చేయడమే కాదు ఆ సొమ్ము భద్రత, దాని అభివృద్ధికి ప్రయత్నం కూడ చేయాలి. అనాధ బాలబాలికల ధనం ఆస్తుల పంరక్షకునిగా ఉన్న వ్యక్తి బీదవాడై తన అవసరాలు తీర్చుకోలేని స్థితిలో ఉంటే, సంరక్షకునిగా చట్ట ప్రకారం తన వేతనాన్ని తీసుకోవచ్చు. కాని సంరక్షకుడు ధనవంతుడైతే జీతభత్యాలు తీసుకోకుండా స్వచ్ఛందంగా సంరక్షణ చేయాలి.

وَمَنْ كَانَ غَنِيًّا فَلْيَسْتَعْفِفْ وَمَنْ كَانَ فَقِيرًا فَلْيَأْكُلْ بِالْمَعْرُوفِ (النساء ٦)

అనాథల సంరక్షకుడు సంపన్నుడయితే అతడు వారి సొమ్ముకు దూరంగా ఉండాలి. ఒకవేళ అతడు పేదవాడయితే దాన్ని ధర్మసమ్మతంగా అనుభవించాలి. *(అన్‌నిసా : 6)*

ఒకవేళ అనాధ బీదవాడైతే, సంరక్షకుడు కూడా బీదవాడైతే అప్పుడు ఆ అనాథను సంరక్షించే బాధ్యతను సమాజంపై మోపింది ఇస్లాం. సమాజం ముందుకొచ్చి అనాధల బాధ్యతను స్వీకరించి పుణ్యం సంపాదించాలని అనేక ప్రవక్త (స) ప్రవచనాలు మనల్ని ఆదేశిస్తున్నాయి. ఒక ప్రవక్త ప్రవచనాన్ని ప్రస్తావిస్తున్నాం:

كَافِلُ الْيَتِيمِ لَهُ أَوْ لِغَيْرِهِ أَنَا وَهُوَ كَهَاتَيْنِ فِي الْجَنَّةِ (مسلم، كتاب الزهد)

**"అనాధ సంరక్షకుడు, అతనూ తనవాడు కానీయండి, పరాయి వ్యక్తి కానీయండి, ఇద్దరం స్వర్గంలో ఈ విధంగా ఉంటాం (అని తన చూపుడు వేలు మరియు మధ్యవేలు కలిపి చూపించారు మహాప్రవక్త)." *(ముస్లిం)***

అనాధ బాలబాలికలకు సహాయం చేయకుండా వారిని వీధిపాలు చేయకూడదని, ప్రభుత్వం బాధ్యత వహించి వారికి అండగ నిలవాలని ఇస్లాం ప్రబోధిస్తుంది. సమాజం అనాధ బాలబాలికలను పోషించే బాధ్యత విస్మరించిందంటే, ప్రభుత్వం వారి కష్టాలను గమనించి వాటిని తొలగించే బాధ్యత స్వీకరించాలి. అనాధ బాలబాలికలను పెంచేందుకు. వారి విద్యాశిక్షణలకు అయ్యే ఖర్చుల భారాన్ని ప్రభుత్వమే మోయాలి. మహాప్రవక్త ఇలా సెలవిచ్చారు:

مَنْ تَرَكَ دَيْنًا أَوْ ضِيَاعًا فَلْيَأْتِنِي فَأَنَا مَوْلَاهُ
(بخاری، کتاب فی الاستقراض)

**ఒకవ్యక్తి రుణాన్ని, పసి పిల్లలను ప్రపంచంలో వదలి పరమపదిస్తే, వారిని పెంచే ఏర్పాటు లేక పోయినట్లయితే, వారు నా దగ్గరకు రావాలి, నేను వారి సంరక్షకు నిగా, పోషకునిగా ఉంటాను. (బుఖారి)**

# దిక్కులేని పిల్లల సంరక్షణ

వారసులులేని బాల బాలికల సమస్య నాజూకైన విషయం. తల్లిదండ్రులు ఎక్కడున్నారో తెలియకపోతే వారి పిల్లల బ్రతుకు భారం ఎవరి మీద కూడా వేయలేం. సమాజం కూడా వారి పెంపకం బాధ్యత సులువుగా స్వీకరించదు. అప్పుడు ప్రభుత్వం అలాంటి బాలబాలికల పోషణ బాధ్యత స్వీకరిస్తుంది. హజ్రత్ ఉమర్ (ర) ఇస్లామీ రాజ్యాధి నేత. ఆయన కాలంలో ఒక వ్యక్తి ఒక పసి బాలుని ఎక్కడో ఓ చోట పడి ఉండడం చూశారు. ఆ అబ్బాయిని తీసుకొని ఖలీఫా దగ్గరకు వచ్చాడు. ఆ వ్యక్తి నమ్మకస్తుడని సచ్ఛీలుడని ఖలీఫాకు తెలియజేయడ 7మయింది. ఖలీఫా దొరికిన అబ్బాయిని తెచ్చిన వ్యక్తికే అప్పగిస్తూ 'మీరే అబ్బాయిని పోషించండి. అందుకు అయ్యే ఖర్చు మేమిస్తాం' అన్నారు.

పిల్లల విద్యా శిక్షణలు వారి పెంపక విషయంలో ఈ చిరు పుస్తకం ఒక నివేదికలాంటిది. పిల్లల సంరక్షణ వారి పట్ల జాగరూకత కలిగి ఉండటం వంటి విషయాలలో తల్లిదండ్రుల బాధ్యతతో పాటు మిత్రులకు మరియు సమాజంపై ఉన్న విధులను ఇస్లాం మనకు తెలియపరుస్తుంది. ప్రభుత్వానికి కూడ ఈ బాధ్యతల నిర్వహణలో ప్రమేయం ఉంది. అందరు కలసి అనాధ బాలబాలికల పెంపకంలో శ్రద్ధాసక్తులు చూపవలసి ఉంది. అప్పుడే వారి నైతిక మరియు భౌతిక అవసరాలన్నీ చక్కగ తీర్చబడతాయి. పసి పిల్లల మూర్తిత్వం కూడా తీర్చిదిద్దబడుతుంది. వారు మంచి దైవదాసులుగా రాణిస్తారు. ఇంకా మంచి పౌరులుగా, ప్రజా సేవకులుగా మనగగలరు.

- : సమాప్తం : -